గ్రంథాంతమున:—

సీ॥ అనివరాహస్వామి యష్టాంగ యోగసా
రార్థముల్ భూదేవి కధికదయను
చెప్పినాడని సూతుఁ డప్పుడా శౌనకా
దులకు బోధించె సంతోషమెనఁగ
ననియిట్లు తరిగొండహరికటాక్షమున సు
బ్రహ్మణ్యగురుకృపం బన్నగాద్రి
విభుచెంత నింజేటి వెంగమాంబ వసించి
యీకృతి రచియించె నిదియు వ్రాసి

గీ॥ చదువువారును వినువారు జన్మకర్మ
జలధి తరియింతు రీకథ సారమగుచు
శ్రీగురునిపాదయుగళి కర్పితమునగుచు
నురి మీదఁ బ్రకాశించి యుండుఁగాత ॥

ఈసీసమందలి వాక్యములచేనిది శ్రీతరిగొండ వెంగమాంబ చేతనే రచియింపఁబడినట్లు తెలియుచున్నది. ఈమె వ్రాసినయితరకృతులం దెందును దీనిప్రశంస గానరాదు. ముముక్షువై జీవితమంతయు భక్తిప్రవణముగను శాంతమార్గికముగను గడపిన కతమున నీమెయే యీకృతిని రచించియుండనోపు. ఇయ్యది యోగాభ్యాసనానక్త చిత్తుల కత్యంతముపయోగకారి. ఈమె చరమదశయందీ కృతిని రచించియుండనోపు. సీతారామాంజనేయాది కృతులందు యోగాభ్యాస విషయములున్నను నిందు వివరముగ ననుభవక్రమమున దెల్పఁబడియున్నవి.

## కృష్ణార్జున సంవాదము (S, No. 7410 c)

Substance Palm leaf; Size 18×1½ inches; Leaves 13 Line 9; character Telugu; Condition injured; complete.

ఇదియు పై రెండు గ్రంథములవలె శ్రీకాళహస్తిరాజాగారిపుస్తక భాండాగారమునుండి తేఁబడిన తాళపత్రములలోనిదే. ఇందలికథ గయోపాఖ్యానము. ద్విపదకావ్యముగానున్నది. ఇందు గ్రంథకర్తయెవరో తెలియరాకున్నది. గ్రంథాదిని గ్రంథాంతమునగూడ కర్తపేర్కొనఁబడలేదు. శైలిసరళము. గ్రంథము

పోతన ప్రణీతభాగవతమునే యాధారముగ ననుసరించి వ్రాసినట్లు గ్రంథశైలిని బట్టి తెలియుచున్నది.

గ్రంథశైలి తెలియుటకు భీష్మస్తవఘట్టము క్రిందనీయబడినది.

"శ్రీలలనాధీశ చిదచిత్ప్రకాశ । కాలకర్మాతీత కరుణాసమేత ।
శరణాగతత్రాణ సత్యకల్యాణ । పరమపదస్థాన భక్తనిధాన ।
సురుచిరశిఖిపింఛ జూటఃకుందమరి । యురుపుష్పదామంబు లుభయపార్శ్వముల ।
నొరయుచుభుజములం దుయ్యాలలూగఁ । బరిశోభితంబైన బంగారువలువ ।
సొగసుహొయల్ మీరు చుంగులుజార । వగమించుకనులతో వరకృపారసము ।
శృంగారరసముతో స్నేహంబుఁజేయ । మంగళప్రదమైన మైత్రి జేయుచును ।
అరలేనివన్నెకాఁడనఁబార్థుతోడఁ । దిరుగుచున్నట్టి నీ దివ్యరూపంబు ।
నెలసి నామదిని నావేశించియెపుడు । వెలుగుచువేదాంత వేద్యమైయుండు ।"

* * * * *

"సరుతోడనుభయసేనామధ్యభూమి । నరదంబునిల్పినెయ్యమునవ్వుచును ।
పరులనర్జునునకేర్పడఁజూపిచూచి । పరగఁదచ్ఛత్రుభూపాలాయువులకు ।
వంచింపుచునుబంధువధసేయలేక । చంచలాత్మకుఁడైన శక్రపుత్రునకు ।
ఘనవరయోగప్రకారంబులెల్ల । వినుపించిచూపునీ విశ్వరూపంబు ।
దినమునునేనుచింతించిసంతోష । వసధినోలాడుచు వర్తింతునిచట ।
తురగరింఖాముఖోద్ధూతపరాగ । మరుదుగానిటలాల కాళిపై మెరయ ।
శ్రమబిందుకణగణ సంయుక్తవదన । కమలంబుదీపింపగా విజృంభించి ।
ఘనముగారథఘోటకములరొప్పుచును । మునికోలఁద్రిప్పుచు మొనసిపార్థునకు ।
నుపొంగిసారథ్య మొనరింపుచుండి । యప్పుడునాశరాహతిచేతనొచ్చి ।
కుప్పించియెగసిన కుండలద్యుతులు । గప్పిభూమ్యంతరిక్షములుశోభింప
పదువేత్తబ్జలో పలియజాండముల । బరువునధారుణీ భాగంబు గదల ।
వరచక్రమునుబూని పచ్చువేగమున । బరువడిహాటకపటమొప్పజార ।
నగుభటుఁజేయుదు నాబలంబనుచు । తుగిడియర్జునుఁడువ మ్మతముగాఁదిగువ
చలముతో భీష్ముని జంపజయంబు । వెలయసీకిచ్చెద విజయ రమ్మనుచు ।
కరికిలంఘించుసింగంబుచందమున । తెరలి నాకడకరుదెంచునీమూర్తి ।
మనమునసంచినీ మాయాబ్ధిగడతు । నని యిట్లువినుతించి యప్పుడిట్లు దలచె

ఉ॥ కాయముమీఁదియాస తనకైన జనంబుల మీఁదియాశలున్ ।
మాయని నిశ్చయించి తనమానస మందును ముక్తిసాధనో ।
పాయముఁ జేసి సద్గురుని పట్టుగ నమ్మియు మోహపాశముల్ ।
కోయక ముక్తిరాదు తరికొండనృసింహ దయాపయోనిధీ ॥

ఉ॥ ఇట్టిశరీరమందు నదు లెప్పుడు తీయక పాఱఁగా మఱిన్ ।
బుట్టినభూమిలోపలఁ ద్రిమూర్తులు నుండఁగ గాననేరకన్ ।
బట్టుగ తీర్థయాత్రలకు బామరులెల్లను బోయియూరకే ।
గొట్టుపడంగనేల తరికొండనృసింహ దయాపయోనిధీ ॥

చ॥ మన సొకశుద్ధిలేక ఘనమాయకు లోఁబడియుండి నీళ్లలో ।
మునిఁగి శరీరమున్న దనిపొందుగ నందఱు చూచు చుండఁగా ।
కను లటు తేలవేసి కరకంజములన్ ముకుళించి మంత్రముల్ ।
గొనిగిన ముక్తిరాదు తరికొండనృసింహ దయాపయోనిధీ ॥

ఉ॥ వెన్నయు జేతఁ బట్టుకొని వేమరు నేయని కూయనేటికో ।
పన్నుగ బొందిలోన ఘనభక్తిని జీవి జపంబుసేయఁగా ।
నెన్నుచు వ్రేళ్లు సారెకును నేర్పడ నెప్పుడు గాఢమంత్రముల్ ।
కొన్ని భజింపనేల తరికొండనృసింహ దయాపయోనిధీ ॥ 1

ఉ॥ ముందటిదోవగానకను మూర్ఖులునై బలుజవ్వనంబునన్ ।
సుందరులైన భామినులఁజూచి మనంబు నపేక్షసేయఁగా ।
నిందెలుసేయుచున్ బరుల నేరము లెన్నఁగఁ దాము బుద్ధివోఁ ।
గుందుచు నుందురయ్య తరికొండనృసింహ దయాపయోనిధీ ॥ 10

ఉ॥ నిన్ననె కంటి నీమహిమ నీరజలోచన దివ్యతేజ నీ ।
సన్నిధి దగ్గరాయెను విచారము మానెను ముక్తి గల్గె నా ।
పన్నుగ నిర్విధంబునను భావములోపల నీదుమూర్తిఁ గ ।
గ్గొన్నది భాగ్యమయ్యె తరికొండనృసింహ దయాపయోనిధీ ॥ 10

చ॥ ఎలమిని పెంపుసొంపొదవ నింజెటివంశజుఁడైన వెంకటా ।
చలపతినామధేయునినిజాంగన వెంగమ సత్యవీంద్రులి ।
మ్ముల ముదమంద నీశతకమున్ రచియించి యొసంగె మీకుఁ గో ।
ర్కులు సమకూర్పవయ్య తరికొండనృసింహ దయాపయోనిధీ ॥ 10

శ్రీ తరికొండనృసింహశతకము సంపూర్ణము - శ్రీ శ్రీ శ్రీ

ఉ॥ బోధశరీరుఁ జేరి తనబొందిన నుండుమహాత్ముఁ గాంచి బల్ ।
సాధుల సేవఁ జేయుచును జాలఁగ నింద్రియకాంక్ష మానుచున్ ।
మాధవు నాత్మ నెన్నుచును మున్నవిభుం డటుమర్త్యకోటిపైఁ ।
క్రోధము నిల్పఁబోఁడు తరికొండనృసింహ దయాపయోనిధీ ॥ 83

ఉ॥ భేదము లేక సర్వము నభేదముగాఁ బరిమాణపూర్ణుఁడై ।
బాధకదేహమందు బహుభావము దోఁచి సదాస్వరూపుఁడై
మోదముఁ జెందుచుండఁగను బొందుగ నాసుధ జీవి కింక కా
కోదర మంత గోరిలుఁ దరికొండనృసింహ దయాపయోనిధీ ॥ 84

ఉ॥ ముట్టనిదూర మేగి యట మూఁడుదినంబులు పైటనుండి యా
ముట్టెడఁ బాపఁ బూని బహుముఖ్యతరంబుగ బొంది లోఁ
బట్టుగ ముంచివేసినను బన్నుగ దేహికి ముట్టుపోవునే ।
గుట్టొకటుండఁగాను దరికొండనృసింహ దయాపయోనిధీ ॥ 85

చ॥ ఇదివరదాఁక దేహముల నెన్ని ధరించితి నెన్ని పోయెనో ।
మది నినుఁ బాయనేరకను మాయనుదానికి చిక్కియుంటి నీ ।
పదములు నేఁడు గంటి హరి పట్టుగ నా కిటుబ్రహ్మవిద్యలోఁ ।
గొదవలు సేయకయ్య తరికొండనృసింహ దయాపయోనిధీ ॥ 86

ఉ॥ మర్కటరాజపాల నిను మానసమందుఁ దలంచి పుణ్యముల్ ।
శర్కర పాలు వెన్నయును జాలభుజించినరీతి దోచు నో ।
యర్కకులాబ్ధిచంద్ర బలుయాకలి దీరును రాఘవేంద్ర నా ।
కోర్కెలు చెల్లెనయ్య తరికొండనృసింహ దయాపయోనిధీ ॥ 87

ఉ॥ పాటగునన్నమున్విడిచి పత్రము లెప్పుడు మేయనేల బల్ ।
యేటికి కట్ట వేసినను నెన్నిదినంబులు నిల్చుఁదోయముల్ ।
బూటక మింతె కాదె మరిపొందుగ జన్మము లెత్తుటెల్ల యీ ।
కూటికిఁగాదె స్వామి తరికొండనృసింహ దయాపయోనిధీ ॥

ఉ॥ భోగము భాగ్యముల్ గలిగి పూర్వము నెవ్వరికైనఁ బ్రేమతోఁ ।
ద్యాగగుణంబు గల్గియును దానము సేయగలేనిగాసిచే ।
దాఁగి దరిద్రభూత మటు తప్పక నేఁటికి వెంటనంటె నూ ।
కో గతి యెవ్వరంద్రు తరికొండనృసింహ దయాపయోనిధీ ॥ 89

చ॥ సరసము నీతి సాహసము జాణతనంబును మేలిమైనమున్ ।
పరమప్రతివతాగుణము తాళిమి బు

... ... ...

... ... ... 68

ఉ॥ నీతికి లోనుగాక పరనిందలు సేయుచు నెల్లకాలమున్ ।
ఘాతుకబుద్ధి మానకను గల్లలు వల్కుచు

69

ఉ॥ కల్లరి కేల నిక్కమును ఘాతకను ద్యాలి కేల ధర్మమున్ ।
పొరి కేల నీతులును శాపశరీరున కేల మాటయు

70

ఉ॥ ముష్టికి కాటు కేమిటికి ముక్కిడిదానికి ముక్కరేల బల్ ।
గుడ్డల కేల చల్వలును గుక్కల కేలను జీనిపల్ల

71

ఉ॥ మిండపులవంటిభోగములు మేఘమువంటిది రాజచిత్తమున్
మంచమునిధంబు

72

చ॥ గరిమను హానివృద్ధియును గానఁగ లేక మదాంధకారుఁడై
పరగఁగ దండకాటవికిఁ బొందు

73

చ॥ కలిగినవారికిన్ గలిమి గల్గినవారలు యీపులిత్తురా ।
కలిమియు లేనివారు తమకల్గినయంత

74

చ॥ బలిమిని రచ్చలోఁ గినిసి భాగ్యముగల్గినవాఁడు దబ్బరల్ ।
బలికిన నిక్కమంద్రు మఱి భాగ్యముగానివారు నిక్కమున్ ।
బలికిన దబ్బరందు రిటువంటిది కల్మి ధరిత్రిమీఁదటన్ ।
గులమునిటిండెఁ డాయఁ దరికొండనృసింహ దయాపయోనిధీ 75

ఉ॥ వేషములెల్ల మాని సువివేకము చెంది విచారహీనుఁడై ।
రోషముఁ జంపి భావమున రూఢిగఁ జూచుచునుండువానికిన్ ।
భూషణమైన యట్టి యొక పుష్పలతోటకుఁ బశ్చిమాన మేల్ ।
ఘోష వినంగవచ్చుఁ దరిగొండనృసింహా దయాపయోనిధీ ॥ 54

ఉ॥ బూడిద బూయనేల మరిపొందుగఁ గష్టముఁజేయనేల యే ।
సీడలనుండనొల్లకను నిండినయెండల నుండ నేటికో ।
పోడిమిగాను నాత్మ నిటుపొందుగఁ గాంచినవాని వేడుకన్ ।
గూఁడును మోక్షకాంత తరికొండనృసింహ దయాపయోనిధీ ॥ 55

ఉ॥ మూఁడుగుణాలు మానకను ముందరనుండెడిమూర్తి గానకన్ ।
బూడిద మేనఁబూసి బహుబూటకముల్ పయినేసి ధాత్రిపై ।
వాడక సంచరించుచును వాసగువస్తువు గానకుండినన్ ।
గూడదు ముక్తికాంత తరికొండనృసింహా దయాపయోనిధీ ॥ 56

ఉ॥ భూచరుఁడైన నేమి శివపూజలు చేసి యనేకముద్రలన్ ।
జూచినఁ బుణ్యమేమి యదిచూడకయుండిన నేమి తక్కువల్ ।
ఖేచరిముద్రగాంచి మది కిన్నరభావము మానసంబులో ।
గోచరమైన ముక్తి తరికొండనృసింహా దయాపయోనిధీ ॥ 57

ఉ॥ పామరబుద్ధులన్నియును బగ్గములన్ బిగఁగట్టి సద్గురు ।
స్వామిని జేరి బ్రహ్మమును జాలఁగఁ గాంచినవాఁడు ధీరుఁడై ।
వేమరు ముక్తికాంతను వివేకముగాఁ గవగూడు నన్యథా ।
కోమలి నంటఁ బోఁడు తరికొండనృసింహా దయాపయోనిధీ ॥ 58

చ॥ సతులను చూచి చూచి మది సంతసమందుచు నుందు రెప్పుడున్
గతులు గనంగలేరు నినుఁ గానఁగలేరు వివేకహీనులై ।
సుతు లిఁక మోక్షమిత్తు రని చూచి ధనంబు నపేక్షసేయుచున్ ।
గుతుకము నొందినారు తరికొండనృసింహా దయాపయోనిధీ ॥ 59

చ॥ ఇదియును శాశ్వతంబనుచు నిల్లును ముంగిలి చూచి చూచుచున్ ।
గుదరక కాపురంబులును గొన్నిదినంబులు సేయుచుండగా ।
ముదిసినఁగ మర్త్యకోటులకు మోహము లోభము మీఱిజ్ఞానమున్ .
[illegible] తరికొండనృసింహా దయాపయోనిధీ ॥ 60

ఉ॥ దేశములోన దివ్య మగుతీర్థము సర్వము నిండియుండఁగా ।
వాసి గనంగలేక మనవారును నవ్యలటంచు నుండి ప్ర ।
ట్టాస లనేటితీగెలను నప్పుడు నిశ్చయమంచు కత్తితోఁ ।
గోసెను మద్గురుండు తరికొండనృసింహ దయాపయోనిధీ ॥ 40

చ॥ సరహరి ద్రొక్కి చెప్పెదను నానుడుటన్ గలవ్రాలు ప్రేమతో ।
సరుసగ నంఘ్రిమూలమున నందెడుపూర్వపువ్రాలు దీసి యా ।
సరసిజగర్భుపట్టమున సాంద్రకటాక్షమునుండఁ బంచె మ ।
ద్గురుమహిమేమనందుఁ దరికొండనృసింహ దయాపయోనిధీ ॥ 41

చ॥ గురునకు నీకభేదములు కోరి పఠించితి నంచుఁ జిత్తమం ।
దరయఁగఁ గోపమున్ వలదు యంబుజబాంధవ సోమనేత్ర నీ ।
కరుణను నిన్ను నేఁడు పొడఁగాంచితి సింకను మానమేల మ ।
ద్గురుఁడవు నీవె కాదె తరికొండనృసింహ దయాపయోనిధీ ॥ 42

చ॥ సత మగుసామి నిన్నికను సారెకు నే నెటుఁబోవనిత్తు నా ।
యితముగ నీపదాబ్జముల నేర్పడ గట్టిగఁ బట్టి వేగ శ్రీ ।
పతిఘనభక్తి మార్గమును బగ్గమునన్ బిగఁబట్టి నిన్ను నా ।
కుతికకు గట్టుకొందుఁ దరికొండనృసింహ దయాపయోనిధీ ॥ 43

ఉ॥ పన్నగశాయి నీమహిమ భక్తులకెల్లను గానవచ్చు నీ ।
సన్నిధి దగ్గరాయెను విచారము దీరెను ముక్తిగల్గు నా ।
నెన్నఁగ నీదురూపమును నీగతి నాదుమనంబులోనఁ గన్ ।
గొన్నవిధంబు దోచెఁ దరికొండ నృసింహ దయాపయోనిధీ ॥ 44

ఉ॥ పాటుగ నాత్మదేశమునఁ బన్నగ వెన్నెల గాయుచుండుటల్ ।
యాటకమైన యేడు మన యావరణంబులు నుండు దానిలో ।
మేటగుసర్పమున్నొకటి మేరువమీఁదను కావలుండు నీ ।
కోటవిధంబు గంటెఁ దరికొండనృసింహ దయాపయోనిధీ ॥ 45

చ॥ తొలఁగక మేటికోటకును ద్రోవలు తొమ్మిది దానిలోపలన్ ।
బలిమిగ నంచలంచలను బట్టుగ నార్గురు కావలుందురా ।
వల నొకయేడుచిల్కలును వాసిగఁ బల్కుచునుండు దానిలో
గొలఁకులు రెండు నుండుఁ దరికొండ నృసింహ దయాపయోనిధీ॥ 46

ఉ॥ ఉబ్బుచు దేహగేహమున నూరక లేనటువంటియాస లన్ ।
మెబ్బులిచేతఁ జిక్కి తనుభేదము లెన్నుచు నున్నదాన నా ।
మబ్బును బద్మమిత్రుగతి ద్రుంచగ సంహరణంబుఁ జేసి నన్ ।
గొబ్బున గావవయ్య తరికొండనృసింహ దయాపయోనిధీ ॥ 26

చ॥ అనిశము దుష్టవర్తనుల నార్గురిసాధకమెట్లు చేతు నా ।
మనమున నుండుటల్ దురభిమానము నెట్లు సవాలు చేతు మ ।
జ్జనమును భోజనం బుడుగు సాధక మేగతిఁ జేతు నింక నా ।
కను నొకదారిఁ జూపు తరికొండనృసింహ దయాపయోనిధీ ॥ 27

చ॥ ఎనసి మనంబుతోడ సకలేంద్రియముల్ పెడఁబాయఁజాలకే ।
ఘనముగఁ గర్ణరంధ్రములు గానము గోరుచునుండు జర్మముల్ ।
దనరగ మాదిపానుపులు తక్కఁగఁ గోరుచునుండుఁ జూడు దు ।
ర్గుణముల కేమనందుఁ దరికొండనృసింహ దయాపయోనిధీ ॥ 28

ఉ॥ మీఱికచక్షురింద్రియము మేలగువింతలు చూడఁ గోరు వి ।
స్తారముగాను జిహ్వా రుచి సారెకుఁ గోరుచునుండు నాసికం ।
బౌరయ గంధవాసనల నందము మీఱ గ్రహింపఁగోరు దు ।
ష్కారిక లిన్ని చూడు తరికొండనృసింహ దయాపయోనిధీ ॥ 29

ఉ॥ చూడు మహానుభావ యొకచోద్యపుఁ జీవుఁడు దేహకాంక్షలన్ ।
వీడఁ డవెన్ని చెప్పిన వివేకము గల్గదు యెంత మత్తుఁడో ।
కాఁడు దురాశలన్ విడిచి ప్రాకృతభంగిని నింద్రియాలతో ।
గూడెడఁబాయలేఁడు తరికొండనృసి.హ దయాపయోనిధీ ॥ 30

ఉ॥ జోడుగ నెల్లగాలమును సొంపున నా పరమాత్ముఁ డుండు మేల్ ।
జాడ గనంగనేర్చి తనజాడకుఁ బోవును జీవుఁ డన్యథా ।
జాడకుఁ బోఁదలంచి శివు జాడకు భీతిలుచున్నవాఁడు యీ ।
కోడిగ మేమి చూడు తరికొండనృసింహ దయాపయోనిధీ ॥ 31

ఉ॥ రూఢిగ నాత్మ నాయకుని రూపము గాంచెను నాఁడు వేడుకన్ ।
గాఢప్రపంచమాయలకుఁ గ్రమ్మఱఁ జిక్కఁదలంచి నేఁడు బల్ ।
మూఢుఁడునై చరింపుచును మోహమహావనిఁ జిక్కినాఁడయా ।
గాఢము నమ్మలేఁడు తరికొండనృసింహ దయాపయోనిధీ ॥ 32

12 చ॥ పరికింప చేరఁబోని నరపాలవరేణ్యులమస్తకంబులన్ ।
ఇరువదియొక్కమారులు సుకీర్తిల్ల నుతింపఁగఁ ద్రుంచి విక్రమం ।
వరయుగఁ దల్లితండ్రులకుఁ దర్పణ మొప్పఁగఁ జేసినాఁడవౌ ।
గుఱుతుగ మేరుధీర తరికొండనృసింహ దయాపయోనిధీ ॥

13 చ॥ దశరథరాజునం బోడిమి తాటకిఁ జంపి మునీంద్రయాగముల్ ।
వెసునస కాఁచి యంతటను వేడుకతో మిథిలాపురంబునన్ ।
పశుపతివిల్లు ద్రుంచియును బంతము మించఁగ గెల్చియేలితా ।
కుసుమశరారిమిత్రుఁ దరికొండనృసింహ దయాపయోనిధీ ॥

14 చ॥ మునివియు దేవకీసతికి ముద్దులబాలుఁడవై జనించియున్ ।
ఒనరె యశోదచెంగటను యున్నవి మొప్పగ వృద్ధిఁబొందియున్ ।
ఘన మగుసాహసంబునను గంసు వధించినశూర మొక్కెదన్ ।
కొనకొని నన్నుఁ బ్రోవు తరికొండనృసింహ దయాపయోనిధీ ॥

15 ఉ॥ నిండినభక్తితోడుతను నిన్ను నుతించెద సర్వకాలమున్ ।
అండజవాహ నిన్నుఁ గొనియాడినభాగ్యఫలం బదెట్టిదో ।
పండెను నాదుకోరికలు పండితపాలన బోధరూప యో ।
కుండలిశాయినైన తరికొండనృసింహ దయాపయోనిధీ ॥

16 చ॥ రవికులవార్ధిచంద్ర గురురాయనివాక్యము మేటి కెప్పుడున్ ।
గిరిజనపాల నీమహిమ గాంచెద నింకను గల్కిరూప యహా ।
శివునివిధంబుఁ జూచెదను జీవుని నాత్మను జేరఁజేసెదన్ ।
కువలయపత్రనేత్ర తరికొండనృసింహ దయాపయోనిధీ ॥

17 చ॥ వినుము మహానుభావ మది వేడుకతోడుత విన్నవించెదన్ ।
మొనసెడు స్వాతివానలకు ముత్యపుఁజిప్పల వేట్టలుండు న ।
ట్లనిశము భక్తియుక్తి నిను నాత్మనిభుండవు నీవటంచు నీ ।
కును నెదురేను జూతుఁ దరికొండనృసింహ దయాపయోనిధీ ॥

18 ఉ॥ నారదసన్నుతాంఘ్రియుగ నావిధమెల్లను విన్నవించెదన్ ।
సారెకు నల్లకల్వ లలచంద్రునిఁ జూడఁ దలంచుభంగి నన్ ।
ధీరత మీఱ నిన్నెపుడు దేహములోఁ బొడగాంచుభాగ్యముల్
కోరుచునుందు నయ్య తరికొండనృసింహ దయాపయోనిధీ ॥

శ్రీరస్తు.

తరికొండ వేంగమాంబ ప్రణీతమైన

# శ్రీ తరికొండ నృసింహ శతకము

శ్లో॥ శ్రీకాంతాత్మసరోజచంద్రకిరణం శీతాంశుబింబాననం
శ్రీకంజాక్షజనన్నుతాంఘ్రికమలం చిన్మాత్రమప్రాకృతమ్ ।
లోకాతీతమనేకగోపయువతీలోలం పరం సర్వగం ।
స్వాకారం తరికొండశేషకుధరాధ్యక్షం భజేఽహం సదా ॥

ఉ॥ శ్రీరఘురామ మీకృపను జెల్వముమీఱగ శ్రీగణేశునిన్ ।
వారిజగర్భునిన్ భవుని వాణిని దుర్గను క్షేత్రపాలకున్ ।
సారెకు సర్వదేవతల సత్కవిశూరుల నెల్ల భక్తి నిన్ ।
గోరి భజింతునయ్య తరికొండనృసింహ దయాపయోనిధీ ॥

3 చ॥ మఱియును రెండవిస్తరమున మత్స్యముగాక ఘనసాక్షిరూపమై ।
పరఁగుచు యోగనిద్ర నురపన్నగతల్పమునందు ధీరుఁడై ।
సరసతఁ బవ్వళించి యట సంతతలీలను విశ్వమేలుచు ।
న్గురుని భజింతునయ్య తరికొండనృసింహ దయాపయోనిధీ ॥

3A చ॥ అతులితమైనమీపదవి నందఁ దలంచి విశాలభక్తిచే ।
వితరణగాను మీ రిపుడు వేడ్కను వాక్కుల నిచ్చినంతలో ।
శతకముగాను జెప్పెదను సద్గురుస్వామికటాక్ష మేర్పడన్ ।
కుతుకము మీఱఁగాను దరికొండనృసింహ దయాపయోనిధీ ॥

చ॥ కరుణయు లేక కొందఱు వికల్పకవిత్వ మటంచుఁ బల్కినన్ ।
సరగున నీవు వారలకు సమ్మతిఁ జెప్పి పరాకుసేయకే ।
పరువడితోను నీశతకపద్యము లింక ధరిత్రి మీఁదటన్ ।
గురుతుగ నిల్పవయ్య తరికొండనృసింహ దయాపయోనిధీ ॥

చ॥ హరి నరసింహదేవ నను నందఱిలోను బరాకు సేసినన్ ।
దరి యెవరయ్య స్వామి ఘనతాపసరంజన నీవె గాక యో ।
పరమదయార్ద్రి నాహృదయపద్మమున న్వసియించి ప్రేమతో ।
గుఱిగొని వాక్కు నిమ్ము తరిగొండనృసింహ దయాపయోనిధీ ॥ 5

ఉ॥ అచ్చపుభక్తితోడ దనుజాంతక నే నిటు సర్వకాలముల్ ।
హెచ్చుగ నీ పదాబ్జముల నింపున నమ్మినదాన మాధవా ।
మచ్చికతోడ న న్నెపుడు మన్నన సేయు మహానుభావ యో ।
కుచ్చితముంచఁబోకు తరిగొండనృసింహ దయాపయోనిధీ ॥ 6

ఉ॥ కంజదళాక్ష యంబుధులఁ గావఁ దలంచియు సోమకాసురున్ ।
భంజనఁ జేసి యంతటను భాసురలీలను వేదము ల్తగన్ ।
రంజనఁ జేసి యాక్షణమె బ్రహ్మకు నిచ్చినధీర ముకుందన్ ।
గుంజరరాజపాల తరిగొండనృసింహ దయాపయోనిధీ ॥ 7

చ॥ పరఁగఁగ దేవదానవులు వార్ధి మథింపఁగఁబూనినంత మం ।
దరగిరి క్రుంగఁగాఁ దెలిసి దానికిఁ గచ్ఛపరూప మెత్తియున్ ।
సరసత మూపునన్నిలిపి సర్వజగంబులు మోచినాఁడవౌ ।
గుఱుతుగ నన్నుఁ బ్రోవు తరిగొండనృసింహ దయాపయోనిధీ ॥ 8

ఉ॥ వాడక హేమలోచనుఁడు వార్ధిని వైతు నటంచు భూమినిన్ ।
బోఁడిమిమీఱ నెత్తుకొని పోవుచు నుండినయంతలోన మా ।
ఱాడక వానిఁ ద్రుంచియు ధరాస్థలి రక్షణసేయఁజాలున ।
క్రోడసముగ్రరూప తరిగొండనృసింహ దయాపయోనిధీ ॥ 9

చ॥ ఫెళఫెళ నుక్కుకంబమున బిట్టుగఁ బుట్టి హిరణ్యకశ్యపున్ ।
జెలువుగ గర్భగోళమును జించి సమంచితరక్తధారలన్ ।
గళగళఁ ద్రావి డింభకునిఁ గాచినదేవుఁడ వంచుఁ జాలఁగాఁ ।
గొలిచితినయ్య నిన్నుఁ దరికొండనృసింహ దయాపయోనిధీ ॥ 10

ఉ॥ ఏమనవచ్చు మూఁడడుగు లిద్ధర నిమ్మని కౌతుకంబునన్ ।
తామస మింత లేక కడుఁగఁ దప్పక దానవుఁ డిచ్చినంతలో ।
వేమయి దానవాధిపుని విశ్వములోనికిఁ ద్రొక్కినాఁడవౌ ।

చ॥ మఱిగిరి నీపదాబ్జములు మానసమం దెడఁబాయఁ జాలకన్ ।
గరిమను భాస్కరుఁ డొచ్చుటకుఁ గండములెల్ల నపేక్షసేయు నా ।
కరణిని నీవు వచ్చుటకు గట్టిగ నాహృదయాంబుజంబు మేల్ ।
గుఱుతుగ గోరునయ్య తరికొండనృసింహ దయాపయోనిధీ ॥ 19

చ॥ హరి హరి రమ్ము రమ్మనుచు నార్తుల మానుచు నేను బిల్చినన్ ।
బరువున రావదేమి నినుఁ బట్టగ భక్తులు గట్టివేసిరో ।
మఱచితొ నన్ను నొల్లక రమాసతి నిన్నిటు చేరనీయదో ।
గుఱిగొని రావదేమి తరికొండనృసింహ దయాపయోనిధీ ॥ 20

ఉ॥ మానక నేను బిల్చినను మక్కువ లేక పరాకుసేసితో ।
వీనుల సోఁకలేక లగ విశ్వముపాలన సేయఁబోతివో ।
పూని మహావినోదమున భోగము మీఱఁగఁ గెంచుభామతోఁ ।
గోనలనుండి రావొ తరికొండనృసింహ దయాపయోనిధీ ॥ 21

ఉ॥ నెమ్మదితోడ నిచ్చలును నీనిజరూపము చూడవేడుకన్ ।
రమ్మని నేను బిల్చినను రాజసమో దయ లేక యుంటివో ।
సమ్మతి గాదొ లేక నిను సారెకుఁ బిల్చిన రావదేమొకో ।
కొమ్మన నేమి ముక్తిఁ దరికొండనృసింహ దయాపయోనిధీ ॥ 22

ఉ॥ మేలు కృపాంతరంగ నిను మిక్కిలి నేనిటుఁ బిల్చి పిల్చినన్ ।
ఏల పరాకు చేసెదవె యిప్పుడు నిన్నెదఁ బాయఁజాలకన్ ।
జాలగునీపదాబ్జముల సారములెల్ల మిళిందభాతిఁ గన్ ।
గ్రోలుచునుండునయ్య తరికొండనృసింహ దయాపయోనిధీ ॥ 23

ఉ॥ సుందరదేహ నిన్నిటఁ జూచెద నంచు నపేక్ష చేయుచున్ ।
మందరధారి రమ్మనుచు మాటికిఁ బిల్చిన నిష్టువచ్చి నా ।
ముందర నిల్చి పల్కఁ దగుముద్దులు గుల్కనటింపు మన్న నీ ।
కుందక మేల నింకఁ దరికొండనృసింహ దయాపయోనిధీ ॥ 24

ఉ॥ సారము లేని సంసరణసర్పముచేతికిఁ జిక్కలేనయా ।
తీరకు లేనియాసలను దెచ్చుక యింక నటింపలేనయా ।
పారములేద యొక్కడికిఁ బాపము మాయెడ వాంఛఁ జేసి నా ।
ఘోరముఁ బాపవయ్య తరికొండనృసింహ దయాపయోనిధీ ॥ 25

ఉ॥ శోకశిఖాగ్ని బొందికని పొంతగఁ జన్నెలు సేయుచుండఁగా ।
నేఁడును నింటనుండు నటు నిక్కముగా మరునాఁడు చూచినన్ ।
కాడునఁ జేరి వ్రేఁగలయు కాలునిచెట్టనుబట్టి గ్రమ్మరన్ ।
గూడునఁ జేరు జీవి తరికొండనృసింహ దయాపయోనిధీ ॥ 33

ఉ॥ ఆవల హంసపుట్టగను నార్భట మందుచు నింటిలోనఁ బో ।
రాడుచు నుండెనంతలను సంతసకింకరు లొచ్చి వేగఁ న ।
న్నీడిచి తన్నగాను దన కెవ్వరు నడ్డముగాను రారు యా ।
గోడుఁబాప నీవె తరికొండనృసింహ దయాపయోనిధీ ॥ 34

చ॥ కటకట జీవి నీ వెఁకను గష్టము బొందుచు నుండవద్దు యీ ।
ఘటమును నమ్మవద్దు నినుఁ గాచి యఖండము జూడు నుంచు నే ।
నెటువలె బోధఁ జేసినను నెప్పుడు తాను ఘటాభిమానియై ।
కుటిలము మానఁడాయెఁ దరికొండనృసింహ దయాపయోనిధీ ॥ 35

ఉ॥ కండలు ప్రేవులున్ బలువికారపుటస్థులు చీము నెత్తురున్ ।
నిండిన మూత్రమున్ మలము నెప్పుడు మూగి మహా యసహ్యమై ।
యుండును గుక్షిలోన నిఁక నోహరి యేమని విన్నవింతు నీ ।
కుండకు భోగమేల తరికొండనృసింహ దయాపయోనిధీ ॥ 36

చ॥ మఱపున జీవుఁ డెప్పటికి మాయను దానికిఁ జిక్కి తాను నా ।
యెఱుకను నిల్వనీయకను నెప్పుడు మద్గురువాక్యసంగతుల్ ।
మఱచెద నంచు బోయినను మక్కువతోడుత నన్నుఁ బ్రోవ స ।
ద్గురుఁ డటుఁ బోవనీఁడు తరికొండనృసింహ దయాపయోనిధీ ॥ 37

ఉ॥ ఈడిచి తెచ్చి జీవుని మహీపతి దండనసేయఁ బూని యా ।
మూఁడుగుణాలఁ బట్టుకొని ముప్పిరిపగ్గము వేడి గట్టిగాఁ ।
జూడఁగ నార్గురి న్మదిని జొన్పిన చిత్తము నింద్రియాంబులన్ ।
గూడ బిగించినాఁడు తరికొండనృసింహ దయాపయోనిధీ ॥ 38

చ॥ పసగలసామి న న్నెపుడు పాలనసేయఁ దలంచినాఁడో నా ।
కుశలము గోరినాఁడు నను గొబ్బున రక్షణచేసి ప్రేమతో ।
విసువక నామనంబు గడుపింతగుటన్ మదకుంజరాన కం ।
కుశముగ నిల్పినాఁడు తరికొండనృసింహ దయాపయోనిధీ ॥ 39

చ॥ కొలఁకులమధ్యమందు నొకకోమలియున్నది దానిలోపలన్ ।
సలలితవహ్నిమండలము చంద్రదివాకరమండలంబులున్ ।
అలవడ నాఱుచక్రముల కావల నందొక సారసంబులో ।
గులుకుచునుండు హంస తరికొండనృసింహ దయాపయోనిధీ ॥ 47

ఉ॥ గీష్పతిబ్రహ్మశేషనుతకీర్తివిశాల దయాంతరంగ నో ।
పుష్పశరారిమిత్ర విను పొందుగ దేహములోన మేటిగాఁ ।
బుష్పము లేదునుండు తనముందర నందొకమున్ త్రిపుష్పముల్ ।
గోష్పదభాతి నుండుఁ దరికొండనృసింహ దయాపయోనిధీ ॥ 48

ఉ॥ భాసురలీల సోఽహమను భావములన్ నిరతంబు చాల హం ।
సీ సహితంబుగాను మతిచేసెను మిత్రు శిలా భగీరథీ ।
కాశి గయా ప్రయాగలును ఖ్యాతిగ దేహములోన చేర్పఁగన్ ।
కోశము త్రైమునుండుఁ దరికొండనృసింహ దయాపయోనిధీ ॥ 49

చ॥ అరయఁగఁ జేతనుండును గణాధిపుఁడున్ యమరాజసంగముల్ ।
యిరవుగ బ్రహ్మవిష్ణులు మహేశుఁడు రుద్రుఁడు సర్వలోకముల్ ।
సరసిజసంభవాండమునఁ జక్కఁగనుండును యామ్యజాండముల్ ।
గురుతుగ నాత్మనుండుఁ దరికొండనృసింహ దయాపయోనిధీ ॥ 50

ఉ॥ కంఠములోనినాళ మతికాంతిగ వెల్గడిగీతిఁ జూచి యా ।
కంఠముమీఁద రెండు బలుకాటుకకొండలమధ్యమందు శ్రీ ।
కంఠునిఁ గాంచి యంత లయకాలుని వేగమె ధిక్కరించి నా ।
కుంఠముఁ జేరవచ్చుఁ దరికొండనృసింహ దయాపయోనిధీ ॥ 51

ఉ॥ నిష్ఠలవెన్నిగల్గినను నేర్పునరణ్యమునందు బొందికిన్ ।
గష్టము లెన్ని చేసినను గ్రమ్మఱజీవుఁడు పుట్టకుండునే ।
యష్టమదంబులన్ ఉడిగి యాత్మను గాంచినవాఁడు వేగ ను ।
త్కృష్టభవాబ్ధి దాటుఁ దరికొండనృసింహ దయాపయోనిధీ ॥ 52

ఉ॥ మూఁడుగుణంబులు న్నణఁగి ముందటిమార్గము గాంచి గ్రక్కునన్ ।
మూఁడు శరీరముల్ దెలిసి ముమ్ములకోనన చేరి ధీరుఁడై ।
మూఁడుప్రవాహముల్ గలసి మోదము నొందుచు నుండుచోటునన్ ।
గూడిన మోక్షమబ్బుఁ దరికొండనృసింహ దయాపయోనిధీ ॥ 53

ఉ॥ పుట్టుచుఁ గిట్టుచున్ మరియు బోధకశేఖరుని గానవేరకన్ ।
పట్టిదురాశలన్ దగిలి వారిజగంధులమీఁది ప్రేమచే ।
నెట్టన కాపురంబులును నిక్కమటంచును నమ్మి యాత్మలో ।
గుట్టు గనంగలేరు తరిగొండనృసింహ దయాపయోనిధీ ॥ 61

ఉ॥ కట్టిడిబుద్ధి లేక మరికాపురముల్ సతమంచు నమ్మకన్ ।
జుట్టిన మోహపాశములఁ జూఱునఁ గోసిన బుద్ధిమంతుఁడున్
బట్టగునట్టి దేశికుని ప్రాపునఁ జేరి మనంబు నిల్పి యా ।
గుట్టు గనంగ నేర్చుఁ దరికొండనృసింహ దయాపయోనిధీ ॥ 62

ఉ॥ ఎక్కడిరొక్కమోజనము లెక్కడిభాగ్యము లెక్కడింతులున్ ।
యెక్కడిపాడిపంటలును యెక్కడిబాంధవు లెల్లనాఁటికిన్ ।
దక్కక వృద్ధరూపమును దాల్చినఁ బుత్రకు లింటివాఁకిటన్ ।
గుక్కలఁ దోలుమంద్రు తరికొండనృసింహ దయాపయోనిధీ ॥ 63

ఉ॥ యెవ్వనమందు నాథులకు నింతులు మే లుపచార మేర్పడన్ ।
నివ్వటిలంగఁ జేతురు త్రినేత్రునివీడనిభ [illegible]ుండ రా ।
యెవ్వనమంత బోవ మరియింతులు నాథుల లెక్కసేయకన్ ।
గ్రొవ్వినమాటలంద్రు తరికొండనృసింహ దయాపయోనిధీ ॥ 64

చ॥ మనుజులు మందబుద్ధిఁ జని మానవనాథుల నాశ్రయించుచున్ ।
ఒనరగఁ దర్కవాదముల నూరక చేసి ధనంబు దెచ్చి యా ।
తనయుల కంచు గొందుఱను దాతురు లోభముచేత నేర్పడన్ ।
గొనకొననీదు ముక్తి తరికొండనృసింహ దయాపయోనిధీ ॥ 65

చ॥ స్థిరమగుమానసంబునను శ్రీహరి నిన్నెపు డాశ్రయించినన్ ।
దరగక యింట నుండు దివిజాధిప

66

ఉ॥ చెండితనంబు మానకను చెప్పినమాట గ్రహింపనేరకన్ ।
యుండెడి భార్యతో తగులుయూ

67

మ॥ కలియుగమందు నిక్కముగఁ గల్లలు దోఁచె జంబుకత్రై
బలిమిగఁ దోఁచసాగె మరి బ్రహ్మజనంబుల శూద్రకోటులున్
ఎలమిని నెంచరైరి ధరయెక్కువతక్కువ లేకపోయె న|
త్కులము లసత్యమాయెఁ దరికొండనృసింహ దయాపయోనిధీ ॥ 76

ఉ॥ ధర్మమె శాశ్వతం బనుచుఁ దప్పక యెన్నచునుండువాఁడు నే|
కర్మనిరూఢుఁడై యొనరఁగాను ధరిత్రిని గీర్తిమంతుఁడై |
నిర్మలచిత్తుఁడై యొనఁగి నీపదపద్మములందుఁ జేరునో
కార్మశరీర స్వామి తరికొండనృసింహ దయాపయోనిధీ ॥ 77

చ॥ పరగున నాత్మలోపలను సద్గురుఁగాంచినవాఁడు క్రమ్మఱన్
అరుగఁడు దుర్గుణంబులకు నెందుకు నాదృశమేను జెప్పెద
న్మరి కదళీఫలంబు తగ మక్కువతోడ భుజించువారముల్ |
కోరుకునె ముష్టికాయ తరికొండనృసింహ దయాపయోనిధీ ॥ 78

చ॥ అలరువిధిన్ నిషేధమును నాత్మకు లేదిటు లెంచి చూడ నీ|
కలఁకలు మానలేకను వికారములైన ప్రపంచమాయచే
బలిమిగఁ జిక్కి భేదములు పల్కుదు గాని మహాత్మ యాత్మకున్ |
గులమును గోత్ర మేది తరికొండనృసింహ దయాపయోనిధీ ॥ 79

ఉ॥ పుణ్యుఁడవైనసద్గురునిపూజ నిరంతముఁ జేసి భక్తిచే|
గణ్యము సేయకాగురునిఁ గండలుగాఁ దెగగోసి మోక్షమున్ |
గణ్యముఁ జేసి ముక్తియనుకాంత వినోదముఁ జూడ వేఱ సా|
ద్గుణ్య మెఱుంగలేఁడు తరికొండనృసింహ దయాపయోనిధీ ॥ 80

ఉ॥ వేధకుసంశయంబులును వీడి నిజస్థితి నుండి భక్తిచే|
సాధకమైనయానిగమసారములో రుచిఁ జూడలేరు స|
ద్బోధ వినంగలేరు తమబుద్ధొకచోటను నిల్పలేరు దు|
ర్క్రోధము మానలేరు తరికొండనృసింహ దయాపయోనిధీ ॥ 81

ఉ॥ చూపునిజంబు చేసి యొకచోటనె చక్కఁగఁ జూడలేరు క|
న్నాపలమధ్యమందుఁ బరబ్రహ్మకళంతయు నిల్పలేరు సం|
తాపము మానలేరు నొకదాఁటుగ నాత్మ గనంగలేర యా|
కోపము నిల్పలేరు తరికొండనృసింహ దయాపయోనిధీ ॥ 82

ఉ॥ పెట్టినవారికిన్ మరియుఁ బెట్టినయంతయుఁ గల్గు నేటికిన్ ।
పట్టిదురాశలం దగిలి వాజతనంబున నన్యసంపదల్ ।
గట్టిగఁ జూడఁ జాలకను కచ్చలు సేయుచు నోరునొవ్వఁగాఁ ।
గొట్టినఁబొందరయ్య తరికొండనృసింహ దయాపయోనిధీ ॥ 90

ఉ॥ పట్టుగ నీశ్వరుండు తనపాలిటనుండిపుడిచ్చినంతలోఁ ।
దిట్టక దీనదేహులను తేటగ లాలన చేసి యన్నమున్ ।
బెట్టు వివేకమానసము పెంపొనరించుచు నూరకుండినన్ ।
గుట్టున లక్ష్మిఁ బొందుఁ దరికొండనృసింహ దయాపయోనిధీ ॥ 91

ఉ॥ పొందియె శాశ్వతం బనుచు బోరున రొక్కము గూర్చిలోభినిన్ ।
బొందఁగ నూరిలోఁ గినిసి భోజుఁడ వంచును భట్లు వేడినన్ ।
ఎందుకు వీరువచ్చి రిదియేమి మహాప్రళయం బటంచు బల్ ।
గొందుల దూరునయ్య తరికొండనృసింహ దయాపయోనిధీ ॥ 92

ఉ॥ అంకితమైనకర్తకిని నాలయమైనటువంటివాఁడ యా ।
శంకరుఁ డిచ్చినంతయు విచారము సేయక నేకభక్తితోఁ ।
బొంకముగాను రచ్చలను భోజుఁడ వంచును బల్కువారికిన్ ।
గొంకక యీవు లిచ్చుఁ దరికొండనృసింహ దయాపయోనిధీ ॥ 93

ఉ॥ ఎవ్వరు లేరు జీవునికి నెవ్వరుశత్రువు లెవ్వరాప్తులున్ ।
యెవ్వరు నిందసేయుదురు యెవ్వరుమెచ్చెదు రెన్నిభంగులన్ ।
యెవ్వరియందు సంతతము నేర్పడ జీవుఁడు నిండియుండుఁ దాఁ ।
గొవ్వున భేదమేల తరికొండనృసింహ దయాపయోనిధీ ॥ 94

ఉ॥ పాటిగ నగ్నిసాక్షిగఁ వివాహమయైనపతివ్రతామణిన్ ।
నీటున నొల్లకన్ మిగుల నేరము లెన్నుచుఁగొట్టితిట్టుచున్ ।
ధాటిగ నన్యకాంతను ముదంబున రక్షణఁ జేసి దానితోఁ ।
గూటమి పాపహేతు తరికొండనృసింహ దయాపయోనిధీ ॥ 95

ఉ॥ తల్లికిఁ గాని బిడ్డలును దైవమునెంచనిమర్త్యకోటులున్ ।
జల్లరబుద్ధితోడ పరసుందరిఁ గోరుచునుండువారలున్ ।
దల్లడమంది నాటికిని తప్పక యీయమధర్మరాజుచేఁ ।
గొల్లకిఁ బోవువారు తరికొండనృసింహ దయాపయోనిధీ ॥ 96

# ద్విపద భాగవతము.

(S. No. 7410 a)

97 Substance Palm leaf, ; Size 20 × 1⅓ inches ; Leaves 43 ; Lines 9 ; character Telugu ; Condition injured ; incomplete.

ఇది శ్రీకాళహస్తిరాజాగారి పుస్తకభాండాగారమునుండి యిటీవల నిట సేఁ దేఁబడిన తాళపత్రగ్రంథములలో నొకటి.

98 ఇది శ్రీతరిగొండ వెంగమాంబవిరచితము. సంస్కృతభాగవతమునకుఁ బనిగింపు. ఈమె నందవరీకనియోగిబ్రాహ్మణదంపతులైన మంగమాంబా కృష్ణార్యులతనూజ. ఇంజేటి వెంకటాచలపతిభార్య. బాల్యముననే యీమెకు వైధవ్యము గల్గెనని యందురు. భక్తురాలై పారమార్థికచింతతో జీవితమంతయు

99 తిరుపతి క్షేత్రమున శ్రీవేంకటేశ్వరుని సన్నిధిని గాలము గడపెనందురు.

ఈకృతి ద్విపదరచన. శైలిమధురమై పాఠకులఁ దన్మయుల నొనరించు చున్నది. భక్తిరసంపుముద్ద యనఁజెల్లు. ఈకృతి రచించుటకుఁ బూర్వము

)0 ఈమె (1) నారసింహశతకము. (2) నారసింహవిలాసకథ. (3) శివనాటకము. (4) రాజయోగసారము. (ద్విపద) (5) కృష్ణనాటకము. (6) పారిజాతాప హరణము. (7) రమాపరిణయము. (8) చెంచునాటకము. (9) శ్రీకృష్ణమంజరి. (10) రుక్మిణీనాటకము. (11) గోపికానాటకము. అను వానిని వ్రాసినట్లిందుఁ జెప్పఁబడియున్నది. ఈభాగవతమున ద్వాదశస్కంధములను వ్రాసినట్లు తెల్పియు

11 న్నది. కాని మద్రాసు కోశాగారమున నున్నప్రతిలో మొదటియాఱుస్కంధములు న్నట్లు తెలియుచున్నది. ఇచ్చట మొదటిమూఁడు స్కంధములు మాత్రము పూర్తి గానున్నవి. ఈమె (యీభాగవతరచనానంతరముకాఁబోలు యోగవాసిష్ఠము

2 వాసిష్ఠరామాయణము) వెంకటాచలమాహాత్మ్యము మున్నగువానినిరచియించి యుండనోవు.

ఇట్టి ద్విపద భాగవతములు దోనూరికోనేరికవి తేకుమళ్ళరంగశాయి గొల్లపిన్నింగయ యను పూర్వకవులచేఁ గూడ రచింపఁబడి యున్నవి.

గ్రంథాదిని వేంకటేశ్వరుఁడు తనకుఁ జిన్నికృష్ణునిరీతి సమీపించి భాగవ తంబు చేతికిచ్చి ద్విపదకావ్యముగ సేయుమని యానతీయ నామె దొరకొ[illegible]

## అష్టాంగయోగసారము (R. No. 7410 b)

Substance Palm leaf; Size 20×1½ inches; Leaves 13; Lines 8; character Telugu; Condition injured; complete.

ఇదికూడ శ్రీకాళహస్తిరాజాగారి పుస్తకభాండాగారమునుండి యిటీవలఁ దేఁబడిన తాళపత్త్రగ్రంథములలోనిదే.

ఇదియు శ్రీతరిగొండ వెంగమాంబాప్రణీతము. ఈమెచే రచింపఁబడినరాజయోగసారమువలె నిది ద్విపదగాక గద్యపద్యాత్మకముగనున్నది. ఇందు తొలిపద్యములందు తాను వరాహపురాణము నలఘుపద్యకావ్యముగఁ జేసినట్లు చెప్పికొనియున్నది. కాని యావిషయ మితరకృతులనెందును నీమె పేర్కొనలేదు. ఆవరాహపురాణమునందు యోగవిషయము విస్తారముగా నున్నందున నాయోగమర్మములఁ జెప్పఁదగునని కొందఱు బల్కినందున నాయోగసరణిని భక్తిప్రధానముగ నీ యష్టాంగయోగసారమును కృతిని రచించినట్లు లీక్రిందిపద్యమునఁ దెలియుచున్నది.

సీ॥ వన్నెకెక్కిన నందవరచౌడమాంబను
శ్రీనివాసుని విరించిని నుతించి
శ్రీతరిగొండ నృసింహుని గీర్తించి
యావరాహపురాణ మలఘుపద్య
కావ్యంబుఁ జేసి యోగము లందు విస్తర
ముగ రచించితిఁ గాన మొనసి సభల
నీయోగమర్మంబు లెఱింగ చెప్పందగు
ననుచుఁ గొందఱు బల్కినందువలన

గీ॥ నావరాహపురాణమం దమరు యోగ
సరణి నీవలఁ దీసి యచ్చటను భక్తి
యోగమే యుంచి యష్టాంగయోగసార
మనఁగ నీకృతి రచియింతు నార్యులార ॥

ఇందు వరాహస్వామి భూదేవికి యోగంబుల వివరించి తెల్పినట్లు చెప్పఁబడియున్నది. అష్టాంగయోగములు, అష్టాదశాసనంబులు, మంత్ర లయ హఠ రాజయోగంబులు, పంచావస్థలు మున్నగు యోగవిషయము లనుభవక్రమము

చెనెం మహారాజరాజశ్రీ బాహురచిన వెంకటప్పనాయనివారికి శ్రీరామరక్ష త్వేంగా వ్రాసియిచ్చినట్లున్నది.

చెన్నపురి ప్రాచ్యలిఖితపుస్తక భాండాగారమున R. 141 a నెంబరుతో నొక గ్రంథమిూ కృష్ణార్జునసంవాద మనుపేరనున్నది. అది నాదిండ్ల గోపనచే రచింపఁబడినట్లున్నది. గ్రంథాదిని రామచంద్రస్తుతిని గూర్చినవి రెంటను సమానము. మద్రాసుప్రతియందు గ్రంథకర్తృవంశమును గుఱించి విశేషముగా నున్నది. ఇచ్చటిప్రతియందు లేదు. మద్రాసునందలి ప్రతి అసమగ్రము. ఇచ్చటిది సమగ్రముగనున్నది. కథాభాగము రెంటను సమానమనియే తోఁచుచున్నది. గ్రంథకర్తృవంశావళి తప్పతక్కినకథాభాగములక్రింద సూచింపఁబడిన భాగములు రెంటను తుల్యముగనే యున్నవి. కావునదీని కర్తకూడ నాదిండ్ల గోపనయనియే చెప్పనగును.

P. BALAKRISHNA MURTI.